# వెలుగు రేఖలు

క వి తా సం పు టి

తాళ్లపల్లి మురళీధరగౌడు

ప్రచురణ :

రిజిష్టర్డ్ సంఖ్య : 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

VELUGU REKHALU
An Anthology of Free Verse by
Tallapally Muralidhara Gowd


యువభారతి

ప్రచురణ : 99

ప్రథమ ముద్రణ : 9 డిసెంబరు, 1983
మార్గశిర శుద్ధపంచమి, రుధిరోద్గారి

ప్రతులు : 1,200

ముఖచిత్రం :
శీలా వీర్రాజు

ముద్రణ :
మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్
1-1-694/2/ఎ, గాంధీనగర్,
హైదరాబాద్-500 380.

ముఖచిత్ర ముద్రణ :
శ్రీ బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్, చిక్కడపల్లి, హైదరాబాద్-500 020.

ప్రతులకు :

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

లేదా

యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

వెల రూ. 5/-

---

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
ఆర్థిక సహాయంతో ప్రచురింపబడినది.

# చెక్కుతున్న శిల్పం

దాదాపు పదిహేనేళ్ళుగా తెలుసు మిత్రుడు శ్రీ మురళీధర గౌడ్ నాకు. మానవత మందహాసం చేసినట్లు నవ్వుతూ ఉంటాడు. కొత్తను చూడాలన్న కోరిక మెరిసేటట్లు చూస్తాడు. మంచిదనం పరిమళించే టట్లు మెత్తగా మాట్లాడుతాడు. సౌందర్యానికీ, సౌకుమార్యానికీ స్పంది స్తాడు వీణా తంత్రిలాగా. అతనితో మాట్లాడితే అదో సంతృప్తి. అతని కవిత్వం వింటే అదోరకమైన ఆసక్తి. అతనితో గడిపే క్షణాలన్నీ మిత్రు లకు వెలుగురేకలే; అదే పేరుతో కవితా సంపుటి రావటం జీవితానికీ, కవిత్వానికీ ఉన్న అవినాభావ సంబంధాన్ని మరోసారి జ్ఞాపకం చేస్తున్న ట్లున్నది. ప్రతికవితలో కవి ప్రతిబింబం కనపడుతోంది నాకు.

"జీవితం నీది
జీవించటం నీచేతిలో వుంది"

అని హెచ్చరిస్తూ 'ఈ క్షణాలను వృధాచేయకు' అని హితవు చెప్పాడు శ్రీ మురళీధరగౌడ్. బ్రతకటమే జీవించటంకాదు. ఆ నిజం తెలిస్తేనే ఈ మాట అర్థమౌతుంది. అనుభవంతో అన్వయించుకోవటం జీవించటం. మిత్రులు మురళీధరగౌడ్ జీవించిన క్షణాలను వృధాచేయకుండా వాటిని కవితలుగా మలచుకొంటాడు.

"బ్రతుకంతా నిషేధించాలి నహారాలను
ప్రతివాడూ ఆహ్వానించాలి నయాగరాలను"

అని తనతరానికి అందించే ఆహ్వానాన్ని గమనిస్తే అతని జీవించే లక్షణం తెలుస్తుంది. అనుభవం పిండుకోలేని బ్రతుకు ఎడారి. విద్యు త్తును సృష్టించగల జలపాతం జీవితం లోని శక్తిసారం. జలపాతంలో దూకుడు ఉంది; రోదన ఉంది. శ్రీ మురళీధరంగౌడు ఆ రెండింటినీ చూస్తాడు; దూకుడు కంటికి కనపడుతుంది; రోదన మనసుకు గోచ రిస్తుంది. కంటితో చూచిన దాన్ని మనసుతో మధనం చేసి కవిగా

మాట్లాడుతాడు. జలపాతంలోని రోదన గౌడు కవిత్వంలో వేదనగా విన పడుతుంది.

"చరిత్ర పుటలు ఎప్పుడూ తడుస్తూనే వుంటాయి
ఒకప్పుడు రక్తంతో మరొకప్పుడు కన్నీటితో"

అనే సత్యాన్ని దర్శింపగల కవిహృదయం లోకవేదనను తనలో ప్రతి స్పందింపచేసుకొనేదే. ఈ వేదనతో లోకానికి జీవించటం నేర్పాలని కవి యత్నిస్తున్నాడు.

''జీవించటం నేర్పాలి–ఎలా ?
మనిషిగా ! మనీషిగా !''.

మనిషిగా మానవతతో మనుగడ సాగించటం, మనీషిగా మానవ జీవితతత్త్వాన్ని శోధించటం గమ్యాలని శ్రీ మురళీధరగౌడ్ నిర్దేశం. మనిషిగా కవిగొంతెత్తినప్పుడు–

"లోకంమీద ఆశచంపుకొని
బ్రతుకులో చీకటి నింపుకొని
భారంగా గడిపే జీవులకు
కవిత్వం మేల్కొల్పు పాడాలి
కర్తవ్యోన్ముఖుల్ని చేయాలి
గాయపడిన హృదయంపై
గేయం సుధలను కురిపించి
బాధల బరువును తొలగించాలి
బ్రతుకుపై తీపిని పెంచాలి
ఇది నాకవితాలక్ష్యం ! ఇది నా జీవిత లక్ష్యం"

అని ఆలపిస్తాడు. మనీషిగా జీవితతత్త్వాన్ని వ్యాఖ్యానించినప్పుడు "జనన మరణాల మధ్య జీవితం–ఆద్యంతాల మధ్య మనిషి'' అని వివేచిస్తాడు.

''ఆద్యంతాలను కలపడం
అర్థం లేనిదే కావచ్చు
అసాధ్యమని మీరు
అన్నా అనవచ్చు
నా ప్రయత్నం మానుకోను
నవ చైతన్యంతో పురోగమిస్తాను''

అని తన దృఢనిశ్చయాన్ని ప్రకటిస్తాడు. మనిషి నుండి మనీషి దాకా కవి చేసే పయనం ఈ కవితాసంపుటిలో అంతస్సూత్రంగా కనిపిస్తుంది.

శ్రీ మురళీధరగౌడ్ తల్లిదండ్రులు భవిష్యవేదులు. ఏనాడో అతడొక మురళిని మోయిస్తాడని ఆశించిన వారు. కన్నవారి ఆశలకు ఆకృతి నిచ్చిన సార్థక పుత్రుడు మురళీధరగౌడ్.

"అనునిత్యం సత్యపథగామినై
అమరత్వం కోసం
అలమటిస్తున్నవాణ్ణి
నాలోని మురళీరవం ఆగిపోదు
ఆశావిపంచి మూగవోదు
యుగాంతాలదాకా
దిగంతాలలో అది పలుకుతూనే వుంటుంది''.

అన్నప్పుడు ఆ నిజం బైటపడుతుంది. మురళీరవం అమరత్వాకాంక్షకు ప్రతీక; విపంచీనాదం మధురత్వానికి ప్రతీక. అమరత్వ మధురత్వాలు కవితాజీవితానికి ఉభయపార్శ్వాలు.

''Be a philosopher, but, a midst all your philosophy, be still a man'' అని David Hume అన్నాడు. అంటే ఎంత తాత్త్వికుడైనా మౌలికంగా మానవతతో జీవించాలి మానవుడని భావం. శ్రీ మురళీధర గౌడ్ ఈ సత్యాన్ని మరువని మా నవతావాది. ఈ సత్యం 'దాహం' అనే కవితాఖండికలో కొట్టవచ్చినట్లు కనపడుతుంది. చెరకు రసం తీసే యంత్రాన్ని చూచిన కవికి—వేదాంతం వెనుకనున్న వేదన వినపడుతుంది.

''ఆ నలిగేది చెరకుగడ కాదు
ఆర్తుడైన సామాన్య మానవుడు
ఆ నలిపేది యంత్రం కాదు
అట్టహాసం చేసే ఐశ్వర్యం"

అంటాడు. సామాజికస్పృహ ఉన్న కవిగాని ఇటువంటి భావన చేయలేడు. ''మృత్యువు జీవితానికి జీవితానికి మధ్య విరామం లాంటిది' అని తత్త్వం చెప్పగల ఈ కవి ''బతికుండగా కడుపు నిండా, అన్నంకూడా పెట్టని మనుషులు, కర్మకాండ పేరిట, ఖర్చుచేస్తున్నారు, ఇదెక్కడి న్యాయం" అని వేదన పడతాడు. "పువ్వును చూసి నేర్చుకో, జీవితంలో, పరిమళాలు నిండుతాయి''అని అందంగా చూచి చెప్పగల ఈ మధుర భావుకుడు, 'నగరంలో అర్ధరాత్రి' వేళ "బ్రిడ్జి ప్రక్కన గుడిసెల్లో'' వినబడే ఏడ్పులను విని ఆర్ద్రుడై "ఆవేళ—చుక్కేదీ రాలి పోలేదు, ఏడుస్తున వాళ్ళ కన్నీటి చుక్కలు తప్ప'' అని ఆవేదన పడతాడు. వెలుగు రేకల్లాంటి చుక్కలను చూచి కన్నీటి చుక్కలుగా దర్శింపగలిగిన తాత్త్విక మానవుడు శ్రీ మురళీధర్. సమాజబాధనే తనబాధగా ఆలపించే సాత్త్విక మానసికుడు శ్రీ మురళీధరగౌడ్.

"ఈగాలి— అందరికీ వీచేదెప్పుడు?
ఈ వెన్నెల— అందరికీ అబ్బేదెప్పుడు?''

అన్న విశ్వశ్రేయోభావనయే ఈకవి గొంతుకలలో నినదించే కవితకు నిత్యసూత్రం!

'వెలుగు రేఖలు' అనే మొదటి శీర్షికలోనే శ్రీ మురళీధరగౌడ్ కవితా స్వభావం వ్యక్త మౌతుంది. కవిత్వం సమాజానికి వైతాళిక గీతం కావాలనీ, వివేకవర్ధనిగా వెలుగొందాలనీ, అన్యాయాలను అణగార్చే కొరడాదెబ్బల నందించాలనీ, మనసులోని సుఖదుఃఖాలకు అభివ్యక్తి మార్గం కావాలనీ కవి ఆశిస్తున్నాడు. నిజానికి ఈ నాలుగు లక్ష్యాలలో ఏదో ఒక్కదాన్ని ప్రధానంగా చేసికొని కవితలు రచించినా ఇతనికి ఏదో ఒక ముద్రవేయటానికి వీలుంది. కాని, నాల్గింటినీ సమన్వయించుకొనే ప్రవృత్తికి ప్రత్యేకంగా ఒక రకం కవి అని

చెప్పటానికి వీల్లేదు. అయితే మానవతా ప్రస్థానంలో ఈ నాలుగు లక్ష్యాలూ నాలుగు వెలుగురేకలు, మానవతావాద కవితకు చతుర్విధ పురుషార్థాలు. సమగ్రజీవితం కావాలంటే ఈ నాలుగంశాలూ ఉండాలని శ్రీ మురళీధరగౌడ్ ఆశయమని గోచరిస్తోంది.

సామాన్యుణ్ణి ఉద్దేశించి– "నువ్వు—
"ఈ ప్రపంచ చదరంగంలో పావువు
నీ కష్టసుఖాలు ఎవరికి కావాలి?''

అన్నప్పుడు వైతాళిక గీతస్ఫూర్తి కనపడుతుంది.

'కాలానికి సంకెళ్లు వేయడానికి యత్నిస్తున్న మనిషి
తనకు తానే తెలియకుండా బందీ అవుతున్నాడు'

అన్నప్పుడు వివేక వీచిక మెరుపులా మెరుస్తుంది.

''బహు పాత్రాభినయంలో
సమర్థులైన నటశేఖరులవంటి
బహురూపుల వాళ్లొస్తున్నారు
పలు నాల్కలవాళ్లూ వస్తున్నారు
మళ్లీ అయిదు సంవత్సరాలదాకా కనిపించమన్న
హామీ యిస్తున్నారు
ప్రజలారా జాగ్రత్త!"

అన్న వాక్యాల్లో కొరడాచురకల చప్పుడు వినిపిస్తోంది.

''కవిత నా కూతురై పుట్టింది
శాంతి తెచ్చింది, కాంతిలా వచ్చింది.
బ్రతుకులోని గాయాలను– నానెచ్చెలి మాన్పితే
బ్రతుకుపై తీపిని పెంచుతున్నది ఈపాప.
ఒకరు నా ఊపిరి; మరొకరు నా కంటి వెలుగు
ఒకరు నా యింటి దీపం; మరొకరు నా ప్రతిరూపం''

అన్నప్పుడు సుఖానుభూతినీ,

'అరాజకం లాంటి

చీకటి ఒడిలో నిద్రిస్తున్న

హృదయ విదారకమైన అసుపత్రి'

ని దర్శింపచేసినప్పుడు వేదననూ మన కందిస్తోంది ఈ కవిత.

శ్రీ తాళ్లపల్లి మురళీధరగౌడు తాను జ్వాలలా మండుతూ కవితను మండించడు; కొవ్వొత్తిలా వెలుగుతూ కవితను కరిగిస్తాడు. ఇతని కవితలో వేడీ ఉంది; వెలుగూ ఉంది.

"ఎవరో నా హృదయాన్ని చెక్కుతున్నారు

ఇది శిల్పమయ్యేనా?'

అన్నాడు కవి 'జీవనసూక్తం' లో.

ఆ చెక్కుతున్నది ఎవరో కాదు అతనిలోని కవి. 'వెలుగు రేఖలు' ఆ కవి చెక్కుతున్న శిల్పం. అనల్పశిల్పాన్ని అనతి కాలంలోనే ఆ కవి అందిస్తాడని ఆశిద్దాం.

జి.వి. సుబ్రహ్మణ్యం

హైదరాబాదు
09-12-83



అమృత హృదయులూ

అనురాగ మూర్తులూ

అభినవ పోతన బిరుదాంకితులు

డా. వానమామలై వరదాచార్యులు గారికి

భక్తితో

# అనుక్రమణిక

# వెలుగు రేఖలు

నా కవితలు -
తట్టిలేపే
వెలుగు రేఖలు -
రగిలే మంటలు -
గుడ్డి నమ్మకాలకు
సమ్మెటపోట్లు-
మదోన్మత్తులకు
కొరడా చురకలు-
మనసు ముంగిట్లో పరచుకున్న
రంగవల్లికలు -
వెతల యెదలు
పాడుకున్న పాటలు.

01.10.1972

# నేను వర్తమానాన్ని

నేను వర్తమానాన్ని
భూత భవిష్యత్తులకు వారధిని
గతంలోకి జారిపోను
భవిష్యత్తులో ఆగిపోను
రానున్న క్షణాలను చూపలేను.

నిప్పులా జ్వలిస్తాను
నిజాలను అబద్ధాలను వడబోసి
మంచిని చేరదీసి
భవిష్యత్తులోకి వెళ్లిపోతాను
బంగరు వంతెన నిర్మించుకుంటూ.

చైతన్యానికి సముజ్వల
కేతనాన్నవుతాను
భావి తరాలకు కరదీపికనై
భాసిస్తాను.

14.07.1971

# చేతనాజ్యోతి

ఇది చేతనాజ్యోతి -
హృదయంలో వెలిగే పరంజ్యోతి.

వెలగడం ఆగిపోదు
వెలిగించడం ఊరుకోదు
చీకటిని చీలుస్తుంది
కూకటి వేళ్ళతో కూలవేస్తుంది.

మది నిండా ఆవరించిన
వ్యధలన్నింటినీ తొలగించే
అఖండ జ్యోతి.

దూరాలు చెరగి పోతాయని
ఘోరాలు కరిగి పోతాయని
పాతకాలు పగిలి పోతాయని
ఘాతుకాలు భస్మమవుతాయని
జాతి చేతిని చూస్తూ
జాతకం చెప్తున్నది.

23.03.1971

# ఇక తెల్లవారుతుంది

ఇక తెల్లవారుతుంది
ఈ చీకటి విడిపోక తప్పదు
ఇంతసేపూ పడగ విప్పిన పాపాలు
ఇక తోకలు ముడువక తప్పదు.

ఉషోదయం కోసం హృదయం
ఉవ్విళ్లూరుతున్నది
మధురగీతం కోసం
ఎదురుచూస్తున్నది.

వెన్నెల వంటి
వెన్నలాంటి – మనస్సు
మహోజ్జ్వల జీవన సంగీతం కోసం
మథన పడుతున్నది.

ఇక తెల్లవారుతున్నది
ఈ చీకటి తెల్లవారుతుంది
ఉదయం లేనే లేదనుకున్నవాని అంతరంగం
ఉవ్వెత్తున ఉప్పొంగుతున్నది.

ప్రతి ఉదయం
చీకట్లు కొడగట్టాలి
ప్రతినిమిషం సుధాఝరి
ప్రజలలోన ఉబుకాలి.

24.04.1972

# నువ్వు నవ్వాలి

పువ్వు నవ్వుతున్నది
పున్నమి చంద్రుడిలా
పరిమళం పంచుతున్నది
తనకేమీ అక్కర లేనట్టుగా

నువ్వెందుకు మరి
వేదనతో
నింగికేసి చూసి కన్నీళ్లు నింపుకుంటావు ?

పువ్వుని చూసి నేర్చుకో
జీవితంలో
పరిమళాలు నిండుతాయి.

మెరపు తీగను చూడు
క్షణకాలమైనా మెరుస్తుంది.
నువ్వు నవ్వాలి
సౌరభాలు రువ్వాలి.

15.08.1974

# లక్ష్యం

ఈ లోకంలో
ప్రతి మనిషి హృదయంలో ఒక గాయం
ఈ గాయాల విరిదండను
మెడలో ధరిస్తాను
మానవుల జాలిగాథల్ని
గేయాలుగా పాడుకుంటాను.
మృతి చెందిన వాళ్ల కోసం శోకిస్తూ
స్మృతుల మధ్య
అనుభూతుల మధ్య
అనుక్షణం కాలం గడిపే
అభాగ్యులకు
నా కవితల ద్వారా
ఊరట కలిగిస్తాను.
లోకం మీద ఆశ చంపుకొని
బ్రతుకులో చీకటి నింపుకొని
భారంగా గడిపే జీవులకు
కవిత్వం మేల్కొలుపు పాడాలి
కర్తవ్యోన్ముఖుల్ని చేయాలి
గాయపడిన హృదయంపై
గేయం సుధలను కురిపించి
బాధల బరువును తొలగించాలి
బ్రతుకుపై తీపిని పెంచాలి
ఇది కవితా లక్ష్యం
నా జీవిత లక్ష్యం.

08.12.1974

# నేను అమరుణ్ణి

ఒకప్పుడు నన్ను
చీకటి కొట్టులో బంధించారు
జీవచ్ఛవంలా చేశారు.

ఇప్పుడు నేను
వెలుతురు ముక్కల్ని
ఆపిల్ పండులా కొరుక్కు తింటున్నాను.

కాలం - ఎప్పుడూ
ఒకేలా ఉండదనడానికి
ఇది గొప్ప ఉదాహరణ కాదా ?

నాకిప్పుడు గాలికున్నంత స్వేచ్ఛ
నా ఉనికికి హద్దులు లేవు

వాళ్లు నా చేతుల్ని నరికేశారు
మళ్లీ కొత్త చేతులు మొలుస్తాయని
వాళ్లకు తెలియదు పాపం

నా శక్తి
వాళ్లకు అర్థం కాలేదు.

తక్కువగా అంచనా వేసి
తలక్రిందులైనారు

తమను తాము
నాశనం చేసుకున్నారు.

కొత్తగా మొలిచిన వేలవేల చేతులు
దుష్ట శక్తుల్ని హతమార్చాయి

అంతటా చైతన్యం నర్తిస్తున్నది
ఆనందం వెల్లివిరుస్తున్నది.

అందుకే అంటున్నాను
"నేను అమరుణ్ణి".

14.07.1977

# ప్రతిచర్య

నీ శరీరాన్నే కాదు
మనస్సునూ చిత్రవధ చేస్తున్నప్పుడు
నీ తరాన్ని. జాతిని
నిర్వీర్యం చేస్తున్నప్పుడు
నువ్వెలా భరిస్తావు మనిషీ!
నీ నిర్మలమైన మనఃఫలకం మీద
మసిబూసి, కసిగా
మహోదారుణంగా హింసిస్తున్నప్పుడు
నీ జీవిత చిత్రపటం మీద
పిచ్చి గీతలు గీస్తున్నప్పుడు
నీ బ్రతుకు కావ్యానికి
వక్రభాష్యాలు చెప్తున్నప్పుడు
నీ కర్తవ్య మేమిటి?
నువ్వంటే గిట్టని ఆ దుష్టశక్తులకు
నీ స్వేచ్ఛ మీదే కన్ను
జీవితాంతం ఇలా భరిస్తూ
బ్రతకడం కన్న
ఒక్క క్షణం ఎదిరించి
నిటారుగా నిలబడి
నింగికేసి చూసి
కర్తవ్యోన్ముఖుడవు కావాలి
నీపై చర్యను త్రిప్పి కొట్టే
ప్రతిచర్యగుణం నీలో వున్నప్పుడే
నువ్వు మనిషిగా జీవిస్తావు
మనీషిగా రాణిస్తావు.

10.12.1977

# నా పాప కవిత

కవిత నా కూతురై పుట్టింది
శాంతి తెచ్చింది
కాంతిలా వచ్చింది.

బ్రతుకులోని గాయాలను
నా నెచ్చెలి మాన్పితే
బ్రతుకుపై తీపిని పెంచుతున్నది ఈ పాప.

ఒకరు నా ఊపిరి
మరొకరు నా కంటి వెలుగు.

ఒకరు నా ఇంటి దీపం
మరొకరు నా ప్రతిరూపం.

పాప ఒక్కొక్క నవ్వులో
పాపాలను కడిగేసే మహిమ వుంది.

వెలలేని నవ్వుల్లో
నన్ను నేను మరచిపోతున్నాను
ఈ పాపను చూస్తూ
నా పసితనాన్ని నెమరు వేసుకుంటున్నాను
గత స్మృతుల జడివానలో
తడిసి పోతున్నాను.

కవిత ఎన్నిరకాల నవ్వుతున్నది!
ఎన్ని విధాల ఏడుస్తున్నది!!

లోకాన్ని చూసి
వింతగా వేదాంతిలా నవ్వే నవ్వుతో
నాకు హితబోధ చేస్తున్నది.

ఈ పాప -
విశ్వ జలధిలో ఒక కణం
కిసలయంపై తొణికిసలాడే హిమబిందువు
ఎప్పుడూ గ్రంథాలయంలో
అక్షర కీర్తులైన రచయితలతో
అనుక్షణం సంభాషించే
నా జీవితంలో కేరింతలు కొడుతూ
ప్రభవించింది కవిత.

09.06.1978

# ఏకాంతం

ఏ కాంతా కనకాలనో కాదు
నేను ప్రేమించేది
ఏకాంతాన్ని ప్రేమిస్తాను.

నిశ్శబ్దంలోంచే శబ్దం పుట్టినట్టు
ఏకాంతంలోంచే
ఆలోచనలు ఆవిర్భవిస్తాయి.

ఎన్నో ఆలోచనలు జాలువారే ఏకాంతం
ఏ ఉరుములూ మెరుపులూ లేని ఆకాశం
అందుకే ఏకాంతాన్ని హర్షిస్తాను
ఆలోచనలను వర్షిస్తాను.

12.03.1979

# నా ఉగాది

ఉగాది పండుగ వచ్చిందంటే
ఉవ్వెత్తున హృదయం ఉప్పొంగుతుంది
ప్రతి తెలుగువాని హృదయం
పరవశిస్తుంది
బ్రతుకులోని విభిన్నరుచులను
చవిచూపిస్తుంది

అయితే ఈవేళ నాహృదయం మాత్రం
తీరని అశాంతికి గురియైంది
తీవ్రమైన నిరసనను ప్రకటిస్తున్నది
ఎందుకో తెలుసా?
ప్రజాస్వామ్యం కంట తడిపెడుతున్న వేళ
శాంతి కపోతం రెక్కలు విరిగిన వేళ
రాజకీయాలలో నైతిక విలువలు లోపించిన ఈరోజు
ఏంచూసి గర్వించను?
ఎలుగెత్తి గానం చేయను ?

ధరలు -
చుక్కలతో చెట్టపట్టాలు పట్టుకొని
ఆకాశవీధిలో విహరిస్తుంటే
పండుగ సంగతే మరచి పోయాను
అమానుషత్వానికి గురియైన స్త్రీలా
అన్నివిధాలా అణచివేయబడుతున్న సామాన్యుడు
దోపిడీకి గురియౌతున్నవాడు
ఎలా పండుగ చేసుకోగలడు?
ఎద గాయాలను మాన్పుకోగలడు?

పువ్వునూ
పసిపాప నవ్వునూ
ఓర్వలేని ఈలోకాన్ని చూసి
నా హృదయం చివుక్కుమంటున్నది.

రాజకీయ చదరంగంలో
ప్రతిసారీ సామాన్యుడిదే ఓటమి
తనదే పైచేయి అంటున్నది దుష్టజనుల కూటమి
నిజాయితీని చేతగానితనంగా జమకడుతూ
ఎదుటివాడిని పరిహాసం చేసే
మనస్తత్వం మనుషుల్లో వున్నంతకాలం
మనం ఏమీ పురోగమించనట్టే
మానసిక పరివర్తన కలిగిన రోజే
మహాపర్వదినం.
మనిషిలో చైతన్యం వెల్లివిరిసినరోజే
మహానందం.

మనిషి మనిషికీ మధ్య
అడ్డుగోడలు తొలగి
అంతరాలు రూపుమాసి
అంతరంగాలు
అద్దాల్లా మెరసినపుడు నాకెంతో సంతోషం
మతం కంటె మనిషే గొప్పయని చాటడం
దివ్వెలా జీవితాన్ని వెలిగించడం
నా అభిమతం.

నిండు గుండెతో నేను
పండుగ చేసుకునే దెప్పుడో తెలుసా ?
తెలుగమ్మ ముఖంలో
చిరునవ్వులు విరిసి నప్పుడు
దేశానికి పట్టిన
దౌర్భాగ్య గ్రహణం విడిచినప్పుడు
కష్టానికీ, శ్రమజీవి చెమటబిందువులకూ
తగిన గుర్తింపు లభించినప్పుడు.

15.03.1980

# నా హృదయం

ప్రతి సంఘటనకూ
స్పందించే హృదయముండడం
ఒక నేరమైతే
నా హృదయ శకలాలను
ఈ లోకం నిండా వెదజల్లుతాను
కీర్తి హస్తాలతో
ప్రపంచాన్ని కౌగిలించుకుంటాను
ధన దాహంతో
విశ్వాంబుధిని త్రాగివేస్తాను
అప్పుడు -
హృదయమే లేని నన్నుచూసి
ఈ లోకం -
నవ్వుతుందో
ఏడుస్తుందో !
చూడాలని వుంది
కాని - ఎలా చూడడం ?
నా హృదయం
నన్ను పీడనంటున్నది.

02.11.1980

# ఈ వేళ

ఈవేళ –
ప్రజానీకం
బురద చిమ్ముకుంటున్న వేళ
ప్రజాస్వామ్యం
గోడలమీద ఏడుస్తున్న వేళ
ఈవేళ
ఎంత గమ్మత్తుగా వుంది !

ప్రజానాయకులు
పదవుల కౌగిళ్లలో కరగుతున్న వేళ
పచ్చని సంసారాలు
బలిసిన చేతుల్లో నలుగుతున్నవేళ
ఎంత దారుణంగా వుంది!

చెవులే తప్ప కళ్లులేని
చట్టం నిద్రిస్తున్న వేళ
ప్రజాసేవ పేరిట
ప్రజాపీడన జరుగుతున్నవేళ
ఎంత విచిత్రంగా వుంది !

''నిన్న'' ఏమీ మిగలనప్పుడు
నిన్నటిలాగే ''రేపు'' అని తెలిసినప్పుడు
వేదనను దిగమ్రింగుతూ
వెర్రిగా సామాన్యుడు నవ్వుతున్న వేళ
ఎంత దీనంగా వుంది !

కమ్మని బ్రతుకుపాట పాడలేక
కలలుకనే అదృష్టంకూడా లేక
ఉసురుసురుమంటూ
ఊపిరి నింపుకుంటున్న వేళ
ఎంత హీనంగా వుంది!

అధికార దర్పంతో
అరాజక శక్తులు
విర్రవీగుతున్న వేళ
నీతికి సమాధికడుతూ
నైచ్యానికి శంకుస్థాపన చేస్తున్నవేళ
మేల్కొంటున్న యుగచైతన్యం మెడలో
ఉరిత్రాళ్లు బిగిస్తున్నవేళ
ఎంత విపరీతంగా వుంది!

11.06.1972

# నగరంలో అర్ధరాత్రి

అర్ధరాత్రి –
అలసి సొలసి నిద్రిస్తున్న నగరం
దినమల్లా విరామం లేక
విశ్రాంతి తీసుకుంటున్న రోడ్లు
రోడ్ల ప్రక్కనే
ఫుట్‌పాతులపై మూగ జీవాలు
విషాదానికి ప్రతినిధులుగా
దైన్యాల దుప్పట్లను కప్పుకొని
నిద్రిస్తున్న అమాయిక ప్రాణులు
ఎముకల్ని కొరికే చలితో
పోరాడి గెల్చిన వాళ్లు.

అక్కడ –
ఎత్తైన భవనంలో
అందాన్ని కొనుక్కుంటున్న మనిషి
బార్‌లో
ఒళ్లు వేడిచేసుకుంటున్నవాడు
ఎక్కడో అవినీతి కౌగిట్లో
నవ్వుల్ని కొనుక్కుంటున్న
నాగరికుడు.

ఆ క్షణం –
బ్రిడ్జి ప్రక్కన గుడిసెల్లో
ఒక్కసారే ఏడ్పులు

ఎవరిదో
జీవయాత్ర ముగిసినట్టుంది
వెలుతురుకోసం పోరాడి పోరాడి
వెలుగును చూడకుండానే
ఆరిపోయాడు.

ఆ వేళ -
చుక్కేదీ రాలిపోలేదు
ఏడుస్తున్నవాళ్ల
కన్నీటి చుక్కలు తప్ప.

22-10-1972

# జీవితం

ఒకవైపు వెలుతురు
ఇంకోవైపు చీకటి
గుప్పెడు వెలుగు
గుప్పెడు చీకటి
పగలు విషాదాంధకారం
రాత్రి అంధకారం
ఈ వేళ
జీవితం ఎంత విచిత్రంగా వుంది!

స్వప్నంలో
వెన్నెలతో ఆడుకుంటున్న ఆదర్శాలు
నింగిని చుంబిస్తున్న ఆశయాలు
నగ్నంగా నాట్యం చేస్తున్న దురాశలు
జీవితమనే నగరంలో
ముసుగుల వెనుక దోబూచులాడే
ముఖారవిందాల్లాంటి కోర్కెలు
చిలుక జోస్యాలు కల్పించే కలలు
జనాభాలా పెరిగిపోతున్న ధరలు
ఈ వేళ సామాన్యుల జీవితాలు
పగిలిన అద్దాల్లా
రాజకీయ పార్టీల కుమ్ములాటల్లా
విషమంగా వున్నాయి.

28-07-1973

# సామాన్యుడు

ప్రతి నిత్యం
సభలలో
శాసనసభలలో
నిన్ను గూర్చిన చర్చే
నీ బడుగు జీవితాన్ని
ఉద్ధరించాలన్న తపనే
అట్టడుగు నుండి
గట్టి పునాది వేయాలన్న ఆరాటమే.
అయినా నీ స్థితి
ఎప్పటిలాగానే వుంది
ఇది అంతు చిక్కని రహస్యం
అర్థంకాని బ్రహ్మ పదార్థం
అందరికీ నువ్వు ప్రధాన వస్తువువు
కవులకు కవితా వస్తువువు
నిన్ను గూర్చి కావ్యాలు వ్రాసి
నిన్ను జూసి కన్నీరు కార్చి
తాము నూతన చరిత్ర సృష్టికర్తలమని
మానవతా మహాకావ్య రచనకు
శ్రీకారం చుడుతున్నామని
కరుణార్ద్ర హృదయులమని
లోకాన్ని నమ్మిస్తారు.

నువ్వు సామాన్యునివే కావచ్చు
కాని -
అందరికీ ఎన్ని విధాలా

పనికి వస్తున్నానో చూడు
నీ గురించి నీకే తెలియని
అజ్ఞాన స్థితిలోనేమో నువ్వున్నావు.

నువ్వు –
ఈ ప్రపంచ చదరంగంలో పావువు
నీ ఇష్టసుఖాలు ఎవరికీ కావాలి?
నిన్ను ఆధారంగా చేసుకొని
తమను తాము బాగుపరచుకోవడం కావాలి.

01.07.1975

# కర్మవీరులు

సమస్యల వలయాల్లో చిక్కుకున్న
వాళ్ల స్థితిని చూసి
ఖేదిస్తున్నావా చెలీ!
వాళ్ల పోరాటాన్ని చూసి
అచ్చెరు వొందుతున్నావా సఖీ!
పట్టు వదలని విక్రమార్కులు వాళ్లు
పట్టుదలతో పరిక్రమిస్తున్న భగీరథులు
సాహసమే లక్ష్మిగా
సహనమే రక్షగా
జీవిత రణరంగంలో
పోరాడుతున్న సాహసికులు
"ఏడుస్తూ బ్రతకడం కన్న
నవ్వుతూ చావటం మేలు"
ఇది వారి లక్ష్యం
ఇంతకీ వాళ్ళెవరో తెలుసా ?
సామాన్యులు.

21.05.1976

# ఇదెక్కడి న్యాయం?

ఎవరో కీర్తిశేషులైనట్టున్నారు
ఎందుకు ఇంకా పుంచడమని
శ్మశానానికి తరలిస్తున్నారు
ఆలస్యమైతే లోకానికి బరువేమో:
చీకటి వెలుగుల్లో
చితికిన బ్రతుకు.
కసితో శవాన్ని కాలుస్తున్నారు
కర్మకాండ బ్రహ్మాండంగా జరుపుతున్నారు
బతికుండగా కడుపునిండా
అన్నంకూడా పెట్టని మనుషులు
కర్మకాండ పేరిట
ఖర్చు చేస్తున్నారు
ఇదెక్కడి న్యాయం ?

06.05.1973

# ఆసుపత్రి

రాత్రి నిద్రిస్తున్న ఆసుపత్రి
నిద్ర రాక క్షణాలు లెక్కిస్తున్న రోగులు
వెలుగు చిమ్మలేని దీపం
మసక మసగ్గా వెలుగుతూ
ఆరిపోతానంటున్నది
రోగులను వెక్కిరిస్తూ
చీకటిలోకి జారుకుంటున్నది.
రోగుల ప్రాణాలతో చెలగాటమాడుతున్న
నిర్దయమైన మృత్యువు
అక్కడ ఆ క్షణం
విలయతాండవం చేస్తున్నది.
ఆసుపత్రిలో చేరే
అర్హత లేక
శిశువుతో పాటూ చనిపోయిన
గర్భిణి.
పగలంతా తిరిగి తిరిగి
కూడు లేక చెట్టు క్రింద
చనిపోయిన ముసలిది.
మందు లేక
డాక్టర్ దయకు నోచుకోలేక
ఆఖరు శ్వాస వదిలిన గుంటి బిచ్చగాడు.
అరాజకం లాంటి
చీకటి ఒడిలో నిద్రిస్తున్న
హృదయ విదారకమైన ఆసుపత్రి.

06.05.1972



తాళ్లపల్లి మురళీధరగౌడు

# చీకటి

చుట్టూ చీకటి
విషాదంలా అలుముకున్న చీకటి
ఆర్తుల కన్నీళ్లను
పులుముకున్న చీకటి
మోసాల ప్రాంగణాల్లో
చిందులు తొక్కుతున్న చీకటి
ఉషస్సుకు
అడ్డంగా నిల్చిన చీకటి
సిగ్గులమ్ముడు పోయేచోట
తిష్ఠ వేసుకున్న చీకటి.

06.05.1972

# వ్యత్యాసం

సఖా!
ఈ దోసిళ్లతో
వెన్నెలను త్రాగివేద్దామనుకున్నాం కదూ!
ఈరోజు
కన్నీళ్లను త్రాగుతున్నాం
ఎంత వ్యత్యాసం!

మన నిట్టూర్పులతోనే
ఈ విశ్వమంతా నిండిపోయింది
ఇక చల్లని గాలి యేది?
చల్లదనం కలవారి లోగిట్లో
కమ్మదనం కలవారి గుప్పిట్లో

ఆ గాలి
అందరికీ వీచేదెప్పుడు?
ఆ వెన్నెల
అందరికీ అబ్బేదెప్పుడు?

20.04.1974

# కాలంవెంట నేను

వేగంగా పరుగెత్తుతున్న కాలం
కాలం వెంట నేను
కాలం వేగాన్ని అందుకోలేక
వెనకబడి పోతున్నాను
వేగాన్ని పుంజుకోలేక
చతికిల బడుతున్నాను
కరిగిపోతున్న కాలాన్ని చూసి
బేలగా నవ్వుకుంటున్నాను

కాలం గారడీలో తమాషాలెన్నో
నిత్యమూ జరిగే చిత్ర విచిత్రాలెన్నో
మమతానురాగాలను మరచిన జనత
నిర్మాణాత్మకంగా ఆలోచించని యువత
స్వార్థంతో నిండిన రాజకీయాలు
ఎక్కడుంది నవత ?
ఎక్కడచూడను రవ్వంతైనా మానవత ?

కాలం మారుతున్నది
కాని మారని మనుషులు
రంగు వెలిసిన మనసులు
మారుతున్న కాలాన్ని అందుకోలేని నేను
కరిగిపోతున్న ఈ కాలం తమాషాలో
కావేషాలను, కార్పణ్యాలను చూస్తూ
కర్తవ్యాన్ని ఆలోచిస్తున్నాను.

నాగరికత ముసుగులో
వెర్రిపోకడలు పోతున్న ప్రజలు
ఏం సాధించారని హర్షించను?
హక్కులకోసం పోరాడే వీళ్లు
బాధ్యతలను మరచి
మనుషుల ప్రాణాలతో చెలగాటమాడే
పాషాణ హృదయులు మానవతావాదులా ?
కాలానికి సంకెళ్లు వేయడానికి ప్రయత్నిస్తున్న మనిషి
తనకుతానే తెలియకుండా బందీ అవుతున్నాడు.

ఒకనికి పదవి కావాలి
మరొకనికి పెదవి కావాలి
ఇంకొకనికి రెండూ కావాలి
పరువూ ప్రతిష్ఠలను కాలదన్ని
ప్రాణంకన్న మిన్నగా
వీటిని ప్రేమిస్తున్నాడు మనిషి
ఎంత శోచనీయం!
ఈ రెండూ కాదన్నవాడు
వెర్రిబాగులవాడని
వెక్కిరిస్తున్న ఈ కాలంలో
నేను జీవిస్తూ
దాని వెంట పరుగెత్తలేకపోతున్నాను
ఇలాంటి కాలం వెంట
పరుగెత్తి మాత్రం ప్రయోజనమేముంది?

05.02.1980

# జీవన సూత్రం

కాలాన్ని కన్నీటితో కొలుస్తూ
దేహంలోని రక్తాన్ని
స్వేద బిందువులుగా చేసి
శ్రమిస్తున్నాను
**అయినా -**
ఫలితం అనుమానంగానే వుంది.

ఎవరో నాహృదయాన్ని చెక్కుతున్నారు
ఇది శిల్పమయ్యేనా?

కాల సరసిలో వంగి
దోసిలితో దాహం తీర్చుకుంటున్నాను
దాహం తీరేనా?

బ్రతుకు బాటలో
బడలిక తీర్చుకుందామనుకుంటున్నాను
విశ్రాంతి దొరికేనా?

08.01.1981

# ఆత్మీయం

అన్నా!
నీ ఉత్తరం చేరింది
మెల్లగా వీచిన సమీరంలా
నిండుగా గుండెకు హత్తుకొని
నిట్టూర్పు విడిచాను
ఆత్మీయత ఎక్కడ దొరుకుతుంది?
అంతరంగాలు కలిసినచోట
వేదన ఎక్కడ పుడుతుంది?
బాధతో మనస్సు గాయపడిన చోట
అది శోకిస్తే కన్నీరుగా కారుతుంది
అక్షర రూపం దాల్చితే కావ్యమే ఔతుంది
బాధపడడం అలవాటైనవాడికి
వేదాంతం ప్రియంగా తోస్తుంది
నువ్వన్నది నిజం
''మృత్యువు జీవితానికి జీవితానికి
మధ్య విరామం లాంటిది''
మృత్యువునకు చేరువవుతున్నానని
ప్రతి మనిషికీ తెలుసు
తెలిసి బెంబేలు పడడం
భీరువుల లక్షణం
ఎప్పుడూ నేననుకుంటూ వుంటాను
''ఈ జీవితానికి అర్థంవుందా'' అని.
శూన్యంలో ఏమి ఆవిష్కరిద్దామని
సుతారంగా నడచివెళ్తుంది ?

"మనసు చిక్కబట్టుకోవాలి
మనలోని మంచిని పెంచుకోవాలి"
మనస్సు కుదుటపడడానికి
మంచి ముత్యాల్లాంటి మాటలు
ప్రాణం వంటి పంక్తులు
నిర్మలమైన ఆకాశం
నాకేదో చెప్తున్నప్పుడు
నింగిలోని చుక్కల్లో
నిన్ను చూసుకున్నాను
జలజల కన్నీరు కారింది
హృదయం తేలికపడింది.

07.06.1972

# కొత్త లోకాలు

అన్నా !
ఆశయాలు ఉరిపోసుకున్నాయి
ఆదర్శాల చితి
అందంగా భగభగ మండుతున్నది.
వెన్నెల కాపేసింది
చల్లని గాలి వేడెక్కింది
పిచ్చెక్కిన సంఘం
గురిచూసి కొట్టిన దెబ్బకు
వెచ్చని రుధిరం కారుతున్నది.
కారుతున్న నెత్తురులో
ఎన్నో అమాయిక బ్రతుకులు
దీనంగా కనిపిస్తున్నవి
నగ్నమైన మానవాకారాలు
నాకు తెలియని సత్యాలు చెబుతున్నాయి
నాకేవో కొత్త లోకాలను చూపుతున్నాయి.

26.09.1972

# వెలుగులోకాల తలుపులు

గ్రుడ్డి దీపం వెలుగుతున్నది
గుప్పిట్లో ప్రాణం పెట్టుకొని
ఆద్యంతాల మధ్య వెలుగుతున్నది
ఆరిపోవడానికి చింతిస్తూ -

ఆ దీపం లాగే ముసలి ప్రాణం
అవస్థ పడుతున్నది
ఆశా నిరాశల మధ్య
అల్లల్లాడి పోతున్నది.

దీపం మలుగుతున్నది
దిగంతాల్లో కలువడం తథ్యం
దివ్వెలో చమురుపోసే దిక్కు లేదు
దివికి ప్రయాణం కట్టక ఏంచేస్తుంది ?

వెలుగులో ఇన్ని నాళ్లూ
మెచ్చగా బ్రతికిన వాళ్లు
ఇప్పుడు ఎవరూ ముందుకు రావడం లేదు
ఈ లోకం లక్షణమే అంత.

ఆత్మ ఎగసి పోవడానికి
ఆయత్త మవుతున్నది
ఎక్కడో వెలుగు లోకాల తలుపులు
తెరచు కుంటున్నవి.

18.05.1972

# కన్నీటి కవిత

మా గుండెల్ని గాయపరచి
మమ్మల్నందరినీ
కన్నీటి ప్రవాహంలో ముంచి
ఏకాంతంగా శూన్యంలో
నీ దారి చూసుకొని వెళ్లిపోయావా?
ఒంటరిగా కాంతి తీరం చేరుకున్నావా ?
విరిసీ విరియని నీ జీవితానికి
అప్పుడే నూరేళ్లు నిండాయంటే
ఎలా నమ్మమంటావు?
నువ్వు మరణించావా?
అబద్ధం
నువ్వు కవివి
కవికి మరణమా?
అమరుడవైనావు సఖా!

బాధల గాథల్ని
గాథల బాధల్ని
బరువుగా వినిపించావు
వేదనాభరిత సంగీతంతో
మా గుండెల్ని పిండివేశావు.

మిత్రమా !
నిండు గుండెతో
నివాళు లర్పిస్తున్నాను

నిర్మల హృదయంతో
నీ ఆత్మ శాంతికై
శ్రద్ధాంజలి ఘటిస్తున్నాను
కలాన్ని కన్నీటిలో ముంచి వ్రాసిన
ఈ కవిత నీకంకితం.

14.06.1976

# జ్ఞాపకాలు

బ్రతుకులోని సంఘటనలు
మిగిలిపోయినవి
కొన్ని చేదుగా
కొన్ని తీయగా.
ఈ జ్ఞాపకాలు—
బ్రతుకు విలువను పెంచిన
మహిత సన్నివేశాలు
మంచిని నమ్మి చెడిన విషమ ఘటికలు
ఆత్మీయులతో అనుభవించిన
అతి మధుర క్షణాలు
నావారే నన్ను కాదన్న
నిర్భాగ్య నిమిషాలు.

18.02.1981

# అదృశ్య హస్తం

నిన్నెక్కడో చూసినట్టుంది
ఔను -
నిన్నెక్కడో చూసినట్టు జ్ఞాపకం.
నిశ్శబ్ద నీరవ నిశీధిలో కాదు
నిర్నిమేష దృక్కులలో కాదు
నిర్మల సరస్తీరాలలో కాదు
శరన్నవరాత్రులలో అంతకంటే కాదు
అక్కడో ఇక్కడో
ఎక్కడో మరి చూసినట్టే వుంది.

మధుపాత్రిక
నా అధరాలను చుంబించినపుడు కాదు
హృదయేందిర కాలి అందియలు
రవళించినపుడు కాదు
రవ్వంత సడిలేని
చెలి నడకల్లో కాదు
కాని
నిన్నెక్కడో చూసినట్టే వుంది.

గతమంతా వర్తమానంలో
అప్పుడప్పుడూ పునరావృత మౌతున్నప్పుడు
చరిత్ర పుటలు రక్తంతో తడిసినప్పుడు
నువ్వు జ్ఞాపకానికి వస్తావు

అధర్మం తొడగొట్టి
అంధకారంలా వ్యాపించినపుడు

నిలువెల్ల విషంతో
వెల్లువలా పొంగినపుడు
ఎప్పుడో ఒకప్పుడు
తప్పకుండా పనికివస్తావు
నిప్పులాంటి నీ స్వరూపం
గుప్పుమనక తప్పదు.

అన్యాయం తలెత్తి
అరాజకంలా ప్రవర్తించి నపుడు
పిచ్చిగా నర్తించినపుడు
భయంకరమైన పంజాతో
మమ్మల్ని గాయపరచినపుడు
నీ పేరు జ్ఞాపకం వస్తుంది
నీ రూపు మాత్రం సరిగ్గా గుర్తులేదు.

నేనూ - నాతమ్ములూ
నిర్దాక్షిణ్యంగా అణచివేయ బడుతున్నప్పుడు
అధోలోకానికి తొక్కి వేయ బడుతున్నప్పుడు
ఒంటరిగా
కంటికి మంటికి ఏకధారగా ఏడుస్తుంటే
నీ అదృశ్య హస్తం ఆదుకుంటుంది
నీ గుండెల్లో అదుముకుంటావు
నిర్మలమైన నీ ప్రాంగణంలో
ఆశ్రయ మిస్తావు
ఆదరిస్తావు

నీవు తెలుసు
నీ రూపం మాత్రం గుర్తులేదు
కాని
నిన్నెక్కడో చూసినట్టే వుంది.

29.16.1971

# ప్రభాతరేఖలు

తూర్పున
అరుణ కిరణాలను చల్లుకుంటూ
ఉదయిస్తున్నాడు
ఉర్వీతలాన్ని జాగరితం చేస్తూ.

చీకటి దుప్పటిని
చివరి సారిగా లాగివేసి
చిద్విలాసంతో వస్తున్నాడు
చిమ్మ చీకటిని తొలగిస్తూ.

గాఢ సుషుప్తిలో
గుర్తు తెలియక మునిగిపోయిన
విశ్వాన్ని స్పర్శిస్తున్నాడు
విధిని జాగ్రత్తగా నిర్వహిస్తూ.

"నిన్న" కలలుగన్న "రేపటి"ని
నిజంగానే అందిస్తూ
వెలుగులను పంచిపెడుతున్నాడు
జాగృతిని అందిస్తూ.

13.07.1971

# చిరుదివ్వెలు

పాపాయిలు చిరుదీపాలు
దీపాలనుచూసి చీకటి పారిపోయినట్లు
పాపాయిలను చూసి
పాపాత్ములు సైతం కరగిపోతారు.

పాపలు –
స్వర్లోకాల నుంచి దిగి వచ్చిన దేవతలు
భవిష్యత్తుకు వారసులు
ఆనందానికి ప్రతి రూపాలు.

పాపాయిలు వేదాంతులు
ప్రపంచమంటే తెలియని అమాయకులు
కోపాలకు పాపాలకు
పాపాయిలు కోసుల దూరం.

పసిపిల్లలు మోసం తెలియనివాళ్లు
నవ్వే ప్రతి నవ్వులో
కాంతిపూలు పూస్తాయి
ఆనంద సాగరాలు ఉప్పొంగుతాయి.

ఏమీ తెలియని పసిపిల్లలే అయినా –
అన్నీ తెలుసుననుకుంటున్న పెద్దలకు
ఎన్నెన్నో చెప్తారు
పది కాలాలపాటు ఉడిగిపోని
సంపదలెన్నో అందిస్తారు.

12.03.1979

# నిశ్శబ్దం కేక వేసింది

మనసు ముంగిట
ఆలోచనల కన్నెలు నాట్యం చేస్తుంటే
భావాల నెమళ్లు నృత్యం చేస్తుంటే
మొద్దు బారిన మనస్సు
చైతన్య వంతమౌతుంది
అంటే –
నిశ్శబ్దం గట్టిగా కేకవేస్తుందన్నమాట.

మనిషి –
తన ఉనికిని మరచినంత కాలం
ఆలోచించడం మానినంత కాలం
జడుడి క్రిందే లెక్క.
తన కర్తవ్యాన్ని తెలుసుకున్న క్షణం
ఆలోచనలు ఆవిర్భవించిన రోజు
నిశ్శబ్దం కేకవేసిందన్న మాటే.

10.11.1979

# అనురాగవల్లి

చెల్లీ ! అనురాగవల్లీ!!
మా ఆనందోద్యానవనంలో విరబూసిన మల్లీ!!
నిన్నొక యింటికి అప్పగిస్తున్నాం
ఆ ఇంటికే నీ జీవితం అంకితం
బంగారు కలలు కంటూ వెళ్ళిపోతున్నావు నువ్వు
బాధతో గుండెలు బరువు చేసుకుంటున్నాం మేము
మా యెదలలోని తలుపులను
మా లోలోని మనస్సుల తలపులను
తెరచుకొని నిలుచున్నాం
నిన్ను మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తున్నాం
ఒక రక్తం పంచుకొని పుట్టినవాళ్లం
ఒక పంచన పెరిగిన వాళ్లం
ఈ శుభ సమయాన ఏమిటీ కన్నీరు?
కాదు — ఆనంద బాష్పాల పన్నీరు
ఈ పారాణి పరమార్థమేమిటి ?
నీ జీవితం పరిమళించాలని
సుమరాజంలా సౌరభాలు వెదజల్లాలని.
ఈ సంతోష సమయంలో
చల్లుతున్న అక్షతలు
ఆశీస్సుల మంగళాక్షతలు
మమ్మలను మరచిపోకు చెల్లీ
మమతల మల్లెలు వికసించనివ్వు
అనురాగపు పాలవెల్లులు
సదా ప్రవహించనివ్వు. 16.05 1970

# దాహం

చెరకు రసం తీసే యంత్రాన్ని చూశాను
చిత్తం విలవిల్లాడి పోయింది
చిత్రమైన భావాలతో
చిందులు వేసింది.

ఆ నలిగేది చెరకుగడ కాదు
అష్టదైన సామాన్య మానవుడు.

రక్కవేసే దానవుని ఉక్కుచేతుల్లో
చిక్కిపోయిన అమాయకుడు.

ఆ నలిపేది యంత్రంకాదు
అట్టహాసం చేసే ఐశ్వర్యం
శ్రమజీవి చెమట బిందువుల వల్ల దాని
నాలుక తడి కూడా ఆరడం లేదు.

పేదవాడి కన్నీటిని తాగినా దాని
దాహం తీరడం లేదు
అభాగ్యుని రక్తం మధువులా సేవించినా
దానికి తృప్తిలేదు.

ఇక ఈ యంత్రం ఆగేదెప్పుడు
దాని దాహం ఆరేదెప్పుడు ?

07.04.1981



తాళ్లపల్లి మురళీధరగౌడు

# నా తరం

నా తరం యువతరం
నా జాతి వీరజాతి.

చైతన్య వంతమైన నాతరం
నిర్వీర్యం కారాదు
నీరుగారి పోరాదు
నా యువతరం భవిష్యత్తు
అంధకార బంధురం కారాదు.

రాజకీయాల్లో పాచికలుగా వాడుకుంటూ
రచ్చ కీడ్చి తమాషా చూస్తున్న
స్వార్థపరుల శక్తులకు సింహస్వప్నాలు కావాలి
నిజాయితీగా నడవాలి
నిదానంగా ఆలోచించాలి
వివాదం మానుకొని
నినాదంగా మారాలి.

దేశ ప్రజల కలకు యదార్థరూపం యువతరం
ఈ కలలు రంగుల కలలుగానే మిగిలిపోరాదు
నీటి బుడగలుగా మారిపోరాదు
స్వార్థపరుల విషవలయాలు ఛేదించాలి
ఈ ఇరుల తెరలను చింపివేయాలి
అధికార బధిరాంధుల నిషాను
చెదర గొట్టాలి

కన్నీళ్లకు కారణమైన వైనాన్ని
కనిపెట్టాలి
శ్రమ జీవుల చైతన్యాన్ని
గుర్తించనివాళ్లకు
గుణపాఠం చెప్పాలి
బ్రతుకంతా నిషేధించాలి సహారాలను
ప్రతివాడూ ఆహ్వానించాలి నయాగరాలను.

02.12.1981

# ఆశా విపంచి

వెన్నెల కిరణాల్లోనే జీవితం నడుస్తుందని
ఎన్నెన్ని కలలుగన్నాను నేను!

జీవన చషకం
నిత్యం మధువుతో తొణికిస లాడుతుందని
ఎన్ని ఆశల్ని ప్రోగుచేసుకున్నాను !!
బ్రతుకులో కురిసే అమృతాన్ని
దోసిళ్లతో త్రాగాలనుకున్నాను
రసపిపాసను
తనివిదీర్చు కోవాలనుకున్నాను

కాని
జీవన గతిలో
నేను పొందిన సుఖమెంత?
అనుభూతుల స్రవంతిలో
అందుకున్న రస మెంత ?

అయినా –
కవిత్వం కదిలే చోట
కారుణ్యం పొంగాలని
కమ్మగా కలలు గన్న వాణ్ణి
మానవతను వెంటాడే
దానవతను
వంచించాలని కాంక్షించిన వాణ్ణి
చుట్టూ అలుముకున్న చీకట్లను

ఛేదించడానికి
వెలుగు రేఖల్ని నాలో
విలీనం చేసుకున్నవాణ్ణి
బ్రతుకు లోతుల్లోని మధురిమను
స్వంతం చేసుకోవడానికి
నిత్యం తపన పడుతున్న వాణ్ణి
అను నిత్యం సత్యపథగామినై
అమరత్వం కోసం
అలమటిస్తున్న వాణ్ణి
నాలోని మురళీరవం ఆగిపోదు
ఆశా విపంచి మూగవోదు
యుగంతాల దాకా
దిగంతాలలో అది పల్కుతునే వుంటుంది.

13·05.1971

# ఆద్యంతాల మధ్య

ఆమె వచ్చింది
అప్పుడే వికసించిన పూవులా
ఆమె వెళ్లి పోయింది
అప్పుడే రాలిన పండులా
ఈ రెండు సంఘటనలు
ఈ రెంటి మధ్య మిగిలిన ఒక అనుభవం
జనన మరణాలమధ్య జీవితం
ఆద్యంతాల మధ్య మనిషి.
రెండు కొసలనూ ముడి వేద్దామని
రేయింబవళ్లు ప్రయత్నిస్తున్నాను
రెండు రూపాలను ఏకం చేద్దామని
రెప్పవేయకుండా శ్రమిస్తున్నాను.
అర్థంకాని ప్రశ్నలు కొన్ని
అర్థమైనా వ్యాఖ్యానించలేనివి మరికొన్ని
అన్నీ కలిసి నన్ను
అనవరతం పిచ్చివాణ్ణి చేస్తున్నవి.
ఆద్యంతాలను కలుపడం
అర్థంలేనిదే కావచ్చు
అసాధ్యమని మీరు
అన్నా అనవచ్చు.
నా ప్రయత్నం మానుకోను
నవచైతన్యంతో పురోగమిస్తాను
లక్ష్య సాధన కోసం
అహరహం కృషి చేస్తాను.

15.02.1972

# ప్రజలారా జాగ్రత్త!

ఎన్నికలొచ్చాయి
ఎన్నెన్నో కలలతో కల్లలతో
మళ్లీ ఎన్నికలొచ్చాయి.
మనల్ని ఎగరేసుకు పోయే
అభ్యర్థులొస్తున్నారు
రోజు కోరంగు మార్చే
ఊసర వెల్లుల్లాంటి నాయకులొస్తున్నారు
అరచేతిలో వైకుంఠాన్ని చూపే
మాయల మారులొస్తున్నారు
మంత్ర తంత్రాలతో
మనల్ని చిత్తుచేసే
రాజకీయ గారడీ వాళ్లొస్తున్నారు
బహు పాత్రాభినయంలో
సమర్థులైన నటశేఖరుల వంటి
బహురూపుల వాళ్లొస్తున్నారు
పలునాల్కల వాళ్లూ వస్తున్నారు
మళ్లీ ఐదు సంవత్సరాల దాకా కనిపించమన్న
హామీ యిస్తున్నారు
ప్రజలారా జాగ్రత్త!

23.12.1979

# కల - కళ్లు కాకూడదు

చరిత్ర ఎప్పుడూ పునరావృత మౌతూవుంటుంది
చరిత్ర పుటలు ఎప్పుడూ తడుస్తూనే వుంటాయి
ఒకప్పుడు రక్తంతో మరొకప్పుడు కన్నీటితో
కాకపోతే ఏమిటీ దారుణమారణ హోమాలు ?
కులమత ద్వేషాలు - భాషాభేషజాలు
ఒళ్లు గగుర్పొడిచే సంఘటనలు
చూసి భరించలేని సన్నివేశాలు
ఏమి సాధించాడు మానవుడు ?
ఇదా ప్రగతి ? ఇదా మానవజీవన గతి?
మానవుని కనీసపు టవసరాలు
గగన కుసుమాలైన ఈ వేళ
దైన్యాన్ని కళ్లల్లో నింపుకొని
జీవిత చరమాంకంలో నైనా
వెలుగును చూస్తానని ఎదురుచూస్తున్నాడు
ఒళ్లంతా కళ్లుచేసుకొని
పచ్చిపాల వెన్నెలను త్రాగివేద్దామని నిరీక్షిస్తున్నాడు
శ్రామికుని ఒక్కొక్క స్వేదబిందువును చేర్చి
ఆకాశాన్నంటే భవ్యహర్మ్యాలు నిర్మింపబడుతున్నాయి.
నేను చూస్తున్నది - నాకు కనిపిస్తున్నది
ఆ అంతస్థుల మేడల అందాలుకాదు
మేడల పునాదుల్లో సమాధులవుతున్న
మూగ జీవాల బ్రతుకులు
నేను వింటున్నది ఆనంద గీతాలు కాదు
ఆకలి ఆర్తనాదాలు - ఆవేదనా స్వరాలు

అసలు మరుగై
నకిలీయే అధికారం చలాయిస్తున్న లోకంలో
ప్రచారానికున్న గుర్తింపు ప్రతిభకులేదు
నిజాయితీ కళ్ళు మూసుకుంటున్నది
న్యాయం నిదురపోతున్నది-నిజం నిలకడగా లేదు
ధర్మం అధర్మానికి వంత పాడుతున్నది
స్వార్థం కోసం ఎదుటివాళ్ళు చేసే స్తోత్ర పాఠాలు
వింటుంటే అసహ్యం వేస్తున్నది
ఇదా మనం ఆశించింది?
ఇదా మన స్వాతంత్ర్య సమరయోధులు కలలుగన్నది?
హృదయంలో అమృతాన్ని నింపాలి
విషాన్ని కాదు
అవసరం కోసం నవ్వడం కాదు
నిస్వార్థంగా నిర్మలంగా
పువ్వులా నవ్వాలి – గువ్వలా బ్రతకాలి.
గుండె గుండెకూ మధ్య
పెరుగుతున్న అంతరాలను రూపుమాపాలి
సమస్యలకు తట్టుకోలేక
జీవితంలోంచి పారిపోయే పిరికి వాళ్ళకు
బ్రతుకుపై ఆశను కలిగించాలి
జీవితపు విలువలను తెలియజెప్పాలి
జీవించడం నేర్పాలి – ఎలా ?
మనిషిగా! మనీషిగా!!

08.02.1982

# ఈ క్షణాలను వృధాచేయకు

స్వప్నాల వెంట పరుగులెత్తే
ఓ మనిషీ!
స్వప్నం కంటే సుందరంగా
ఈ క్షణాలను మార్చుకో
తృప్తిలేక మితిమీరిన కోర్కెలతో అర్రులు సాచే
ఓ మనిషీ!
ఎండమావుల వంటి కోర్కెలు
ఎన్నడు ఫలిస్తాయనుకుంటున్నావు?
ఎందుకయ్యా వృధాప్రయాస?
''నిన్న'' మరువకు
''రేపు'' గురించి వెరువకు
వచ్చే క్షణాల ముందు వ్రాలివున్న
ఈ క్షణాలను వృధాచేయకు
జీవితాన్ని నందనవనంగా మార్చుకో
జీవితం నీది
జీవించడం నీ చేతిలో వుంది.

13.04.1976

# దివ్వెలు నవ్వుతున్నవి

దివ్వెలు నవ్వుతున్నాయి
దిక్కుల్లో దిగంబరంగా నిల్చి
దిక్కుల్లో నవ్వడం కాదు కావలసింది
దిక్కుతోచని వాడికి
దారిచూపాలి.

దివ్వెలు నిప్పులు కురిపిస్తున్నవి
దీనులకు జరుగుతున్న అన్యాయాలను చూస్తూ
నిప్పులను కురిపించడమే కాదు కావలసింది
నిలువునా అరాజక శక్తులను
కాల్చివేయాలి.

దివ్వెలు – ఎదలో విరిసిన
పువ్వులు –
దివ్వెలు – లోగిలిలో నర్తించే నర్తకి
మువ్వలు.

01.10.1972



అసలు పేరు తాళ్లపల్లి మురళీధర గౌడు అయినా కుసుమశ్రీ, సుపర్ణ అనే నామాంతరాలతో దాదాపు రెండు వందలకు పైగా కవితలు, యాభైకి పైగా సాహిత్య వ్యాసాలు వ్రాసి, ఆకాశవాణిలో ప్రసారం చేశారు. వివిధ పత్రికల్లో ప్రచురించారు. దాదాపు ముప్పైరెండు సంవత్సరాల క్రితం తాళ్లపల్లి సాంబాగౌడు, సూర్యాబాయి దంపతులకు జన్మించిన శ్రీగౌడు బి.కాం. పట్టభద్రులు. స్వస్థలం ఆదిలాబాదు జిల్లాలోని లోనవల్లిగ్రామం. వృత్తి సికింద్రాబాదులోని ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా కంప్యూటర్ విభాగంలో. ప్రవృత్తి రచనావ్యాసంగం 'కన్నీటికీ శ్రమజీవి చెమట బిందువులకూ తగిన గుర్తింపు లభించాల'ని తపన పడుతున్న ఈ కవి 'జీవితాన్నిదివ్వెలావెలిగించాల'ని ఆకాంక్షిస్తున్నారు.

మా తెలుగు తల్లికీ మల్లెపూదండ
మా కన్నతల్లికీ మంగళారతులు
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి

గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి

అమరావతీ నగరి అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండేదాక

రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుతాం నీ ఆటలే ఆడుతాం
జై తెలుగుతల్లీ, జై తెలుగుతల్లీ

— శంకరంబాడి సుందరాచార్య